# నటీ నటులు

కృష్ణ, నాగయ్య, మిక్కిలినేని, ప్రభాకరరెడ్డి,

జగ్గారావు, ఛాయాదేవి.



నూతన తారలు :

శుభ, కల్పన.



అతిథి నటులు :—

సుకుమల, టి. జి. కమల,

మరియు రాజబాబు.

పాటల పుస్తకం వెల : 10 పైసలు.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-4.

# కథా సంగ్రహము :

ప్రతి వ్యక్తి జీవిత పథంలో ఎదుర్కొనే వివిధ సంఘటనల ప్రభావం వలన ఎదురుచూడని ఎన్నో మార్పులకు లోనవుతాడు. పూల బాటపై వెన్నెల జల్లులలో మధురానుభూతులమధ్య తూలుతూ, సోలుతూ, సాగించిన ప్రణయయానం, హఠాత్తుగా ఒక దుస్సంఘటన సంభవించి ఆ ప్రణయం భయంకర ప్రళయంగా మారుతుంది. ఇక ఆ పెనుతుఫానులో చుక్కాని లేని నావగా గమ్యంలేని ప్రయాణీకుడిలా అతడు కదిలి పోతూంటాడు. అతనికి గతంలేదు. భవిష్యత్తు అంధకారం.

విజయ్ జీవితంలోకూడా సరిగ్గా యిలాగే జరిగింది. మంచి కుటుంబానికి చెందిన ధనవంతుల బిడ్డ. యవ్వనోద్యానంలో ప్రియురాలు దీపతో ఆడుతూ పాడుతూ గడిపాడు.

ఇంతలో కాలానికి కన్నుకుట్టింది దీప తండ్రికి దుర్బుద్ధిపుట్టింది నమ్మిన విజయ్ తండ్రిని దగా చేసి, వారి ఐశ్వర్యాన్ని చేజిక్కించుకొన్నాడు. ఈ అఘాతానికి తట్టుకోలేక ఆ మంచిమనిషి మరణించాడు. భరించలేక అతని యిల్లాలు కన్నుమూసింది. ఆ అంధకార సమయంలో విజయ్ హృదయం కోరింది సానుభూతి, ఆదరణ! అది తనకు అందించటానికి దీప తప్ప యింకెవ్వరు సమర్థులు?

దీప యింటికి పరుగెత్తాడు. ఫలితం — దుర్మార్గుడైన ఆమె తండ్రి

నించి అవమానం! విజయ్ క్రుద్ధమైన కంఠంతో "దీపా ఏం చెపుతావో నువ్వే చెప్పు" అన్నాడు. "దీపా అగు" అని కర్కశకంఠం గర్జించింది. దీప నుంచి ఆశించిన సమాధానంలేదు. విజయ్ విస్తుపోయాడు. దీప తన్ను తృణీకరించింది. మనసులు ఎంత త్వరగా మారిపోతాయి. "ఇదా! బ్రతుకంటే" అని ఉడికిపోతున్న గుండెతో...ఎక్కడికి?...ఏమో ..వెళ్ళిపోయాడు. ఐదు సంవత్సరాలు హద్దులేకుండా, అర్ధంకాకుండా కాలం దొర్లించాడు. కట్టుబాట్లతో కూడిన జీవితం అసహజం. అనుభవించడమే జీవితంలోని అంతం. "ఈ పువ్వుతేనెలు ఈ క్షణము - ఆ పువ్వు మధువులు మరు క్షణము గ్రోలుటే తుమ్మెద సహజగుణం" అనే ప్రబుద్ధులమధ్య తాగుతూ తూగుతూ, కేరింతలు కొడుతున్నాడు. "హలో - నా పేరు మాయ" అని ఒకకొత్త వ్యక్తి అతని జీవితంలోకి అడుగుపెట్టింది. లోగడ జరిగిన అన్యాయం కళ్ళకు కట్టినట్లు కథగా చిత్రించింది "ఇదంతా ఎందుకు చెబుతున్నావ్" అన్నాడు విజయ్. ఆమె "నిన్ను అవమానించినదీప యింటికి మళ్ళీ నువ్వు వెళ్ళేపరిస్థితి వస్తే ఏం చేస్తావు" అనిఅంటుంది. ప్రతీకార వాంఛ అతనిలో ప్రజ్వలించింది. ఆవేశంతోవిజయ్ "ఆ యింట్లో వాళ్ళని ముక్కలు ముక్కలుగా నరికేస్తాను" అన్నాడు. ఆమె "అంతవరకూ అక్కర్లేదు. దీప తల్లిదండ్రులు ఏనాడో చనిపోయారు. ఐదు సంవత్సరాలుగా అహర్నిశలు నీపేరే తలుస్తూ దీప మనోవ్యాధితో మంచం పట్టింది. చనిపోయే ముందు ఒక్కసారైనా నిన్ను చూడాలని ఆరాటపడుతోంది. ఈ అవకాశం వినియోగించుకో" అనిఅంది. ఉత్సుకతతో "ఎలా?"

అని అడిగాడు విజయ్. మాయచెప్పింది. "నిన్నా యింట్లో మళ్ళి ప్రవేశ పెడతాను. నీపై వుండే ప్రేమవల్ల దీప తన సర్వసంపదలను నీ హస్తగతం చేస్తుంది. తర్వాత ఎలాగు చనిపోతుంది" "నీకొచ్చే దీపఆస్తిలో సగం నాకివ్వాలి. నీ అంగీకారంగా యీ ఖరారు పత్రంమీద సంతకం పెట్టు. దీప ఆ స్తి ఎట్లాగైనా చేజిక్కించుకునే బాధ్యత నీదేననిగుర్తుంచుకో" అని మాయ హెచ్చరించింది.

అదొక విశాలమైన సంపన్నుల గృహం. కాని అక్కడ నిర్వేదన, విషాదం, పెనవేసుకున్నట్లు కనబడుతూంది. సంపద సౌఖ్యాన్ని యిస్తుందనుకోటం ఎండమావుల్లో నీరుంటుందనుకోవటమే! శుష్కించిన దీప హృదయానికి ఆమె డబ్బు శాంతిని చేకూర్చలేక పోయింది. ఆమె బాధంతా తన ప్రియుణ్ణి ఒక్కసారి — ఒక్కసారైనా చూడాలి. మచ్చలేని తన గుండెను, చీల్చి తన విజయ్‌కి చూపించాలి. పెద్దలు చేసిన అవమానాలకు, జరిపిన అత్యాచారాలకు తన ప్రాయశ్చిత్తం వెలిబుచ్చాలి. ఆ వుద్వేగంతోనే తను కన్నుమూయాలి. ఇదే ఆమె ధ్యేయం! వెయ్యికళ్ళతో ఆమె మనస్సు విజయ్ కోసం వెతుకుతోంది.

తప్పతాగిన విజయ్ అనుకోకుండా ఒక రోజున ఆ యింట్లో ప్రత్యక్షమయ్యాడు. అక్కడున్న పెద్దలు, అంటే ఆమె ఆరోగ్యాన్ని అనుక్షణం కనిపెట్టుండే డాక్టరు శంకరం ఆశ్చర్యపడ్డాడు. దీప ఆ స్తికి ఎవ్వరేం హాని చేస్తారో అని అందర్నీ అనుమానించే అడ్వకేటు గజపతి విజయ్‌ని ఏవ

గించు కున్నాడు. చిల్లర దొంగతనాలు చేసే దీప మేనత్త చిట్టెమ్మ హడలిపోయింది. బయటకు పొమ్మని ఒక్క గొంతుతో విజయ్ పైన కోపంతో విరుచుకుపడ్డారు. వలపన్నిన మాయ తన ఎత్తుగడ నెరవేరుతుందని తలూపింది. "విజయ్ మర్యాదగా బయటకు వెళ్లు" అడ్వకేటు గజపతి కంఠం గద్దించి పల్కింది. "విజయ్" అని దీప పెదవులు కదిలినవి. తన విజయ్ వచ్చాడా ? ఆవుద్వేగం ఆమెలో తిరిగి జవసత్వాలు తెచ్చిపెట్టింది. పాకుతూ వచ్చి "విజయ్" అంటూ వివశురాలై దీప పడిపోయింది. పగతో బుసలు కొట్టే విజయ్ మనసును ఆ ఆక్రందనం స్పందింపచేయగలదా ! పగకూ, ప్రేమకూ పరస్పర వైషమ్యం ! ఫలితం ఏమిటి ?

ప్రతీ కారాన్ని కోరుతూ నాలుకలు చాచి వున్న విద్వేష పూరిత హృదయుడైన విజయ్ ఒకపక్క దీప ఐశ్వర్యాన్ని చేజిక్కించుకోవటం ఎప్పుడెప్పుడా అని కాచుకు కూర్చున్న మాయ – "నీ ప్రేమ నాకు ముఖ్యం నీ యిష్టమొచ్చినట్లు తిరుగు ఎంత డబ్బు కావలిసినా వాడుకో. కానీ – కానీ నాకళ్ళ ఎదుట మాత్రం ఉండు" అని కోరుకునే దీప నిష్కల్మష అమాయక హృదయం ఒక ప్రక్క – ఈ విభిన్న దృక్పథాల సమ్మేళనం ఏ ప్రళయానికి దారి తీస్తుంది ? ఎటువంటి అనర్థాలు సంభవిస్తాయ్ ? దీనికి సమగ్రమైన అర్థం – గూడుపుఠాణిలో చక్కగా ద్యోతకమౌతుంది.

# పాటలు

రచన :
శ్రీ ఆరుద్ర

పాట నెం. 1

పాడినవారు :
ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

పగలూ రేయీ పండుగ
జలసా సరదా వేడుక
చీకు చింతా లేదుర
నీకై నీవు బతకర
ఆడరా పాడరా ॥పగలూ॥

ఈ పువ్వు తేనెలు ఈక్షణము
ఆ పువ్వు మధువులు మరుక్షణము
తాగుటె తుమ్మెద సహజగుణం
అలాగె ఎగురుటే మన విధము
అపుడే హాయి - అపుడే సుఖము ॥పగలూ॥

నీ మనసెవరికి చెప్పకు
నీ మనసెవ్వరి కివ్వకు
నువుకోరేది మాత్రం వదలకు
అది లభియించు దాకా విడవకు
నువ్వేలోకం - ఒకటే మైకం ॥పగలూ॥

రచన : పద్యం నెం. 1 పాడినవారు :
అప్పలాచారి యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

విరివిగా కన్నాలు వేసిన మొనగాడు
మాతాత కతుల మాధవయ్య
సడనుగా మనిషిని చంపగల్గిన మేటి
మీ తాత ఎతుల పోతరాజు
బస్టాండులో పొంచి పర్సులు కొట్టాడు
నా తండ్రి జితుల సత్తిరాజు
కల్లుపాకను సొంత ఇల్లుగా భావించు
రసికుడు నీభర్త రవ్వలయ్య
అట్టివంశాన బుట్టిన యట్టిమనము
ఎట్టి గటితాళమునైన ఇట్టె తెరచి
పెట్టెలో సొమ్ము నేర్పుగా కొట్టగలము
భయము నీకేల పిన్నమ్మ బాధపడకు.

రచన : పద్యం – 2 పాడినవారు :
అప్పలాచారి ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఓ మాయా
ముదర ముగ్గిన బొప్పాసు కాయా
తేరా మెహబూబ్ ఆయా

ప్రేమ మిఠాయి లాయా
ఆవో ! ఖావో ! రాకపోయినావో
నాటు సారా బుడ్డి నీటుగా చేబట్టి
దగుతూ పాడతా
జగమే మాయా !
మాయా
బ్రతుకే ఖోయా !

రచన : పద్యం నెం. 3 పాడినవారు :
అప్పలాచారి యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

హాండ్సప్పు హాండ్సప్పు
నాఎదుట కూర్చొనుట తప్పు
ఈ ఇంటికి నే అల్లుడను
నేను గొప్ప మల్లుడను
మర్యాదగ లేవకుంటే
మెదడు చెదరకొట్టుతా – తిట్టుతా – నెట్టుతా
కత్తితోటి గుచ్చుతా – గుచ్చుతా
ఆ గుచ్చుతా అమ్మా

రచన : పద్యం నెం. 4 పాడినవారు :
అప్పలాచారి యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఓసీ మాయా పచ్చి అరటికాయా
సైటు ఫోగ్రాము నాకున్న సైము చూసి
దున్నపోతుతో సేతువా దొంగప్రేమ
గూఢచారిని నేను, నీ గుట్టు తెలిసె
గుచ్చి చంపుదు వంకాయ గుత్తితోడ.

రచన : పాట నెం. 2 పాడినవారు :
శ్రీ దాశరథి పి. సుశీల యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

తనివి తీరలేదే
నా మనసు నిండలేదే
యేనాటి బంధమీ అనురాగం
చెలియా ! ఓచెలియా !
యెన్నో వసంత వేళలలో
వలపుల ఊయెల లూగామే !
యెన్నో పున్నమి రాత్రులలో
వెన్నెల జలకాలాడామే !
అందని అందాలా

అంచుకే చేరినను
విరిసిన పరువాల
లోతులే చూసినను ॥పల్లవి॥
యెప్పుడు నీవే నాతో వుంటే
యెన్ని వసంతాలైతేనేమి
కన్నుల నీవే కనపడుతుంటే
యెన్ని పున్నమలు వస్తేనేమి
వెచ్చని కౌగిలిలో
హాయిగా కరిగించినను
తీయని హృదయంలో
తేనెలే కురిపించినను ॥పల్లవి॥
ప్రియతమా :
ఓ ప్రియతమా !

రచన : పాట నెం. 3 పాడినవారు :
శ్రీ కొసరాజు పి. సుశీల, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

వెయ్యకూ ఓయ్ మామా చెయ్యి వెయ్యకూ
చెయ్యిమీద చెయ్యెయ్యొద్దూ
చెంత జేరీ కవ్వించొద్దూ
చలిచలిగా వున్నది రోరయ్యో బుల్లోడా
సమయంగానీ సమయం రోరయ్యో పిల్లోడా ॥వెయ్యకూ॥

తగిలించకూ ఓ పిల్లా - నీ పైటకొంగు తగిలించకూ
పైటకొంగు తగిలిస్తుంటే
చిలిపి చూపుల ఉలికిస్తుంటే
సమయం దేవుడు ఎరుగునులే ఓ లమ్మో బుల్లెమ్మో
చేతులు ముందుకు జరుగునులె, ఓ శమ్మో చిట్టెమ్మో
॥తగిలించకూ॥

చిలిపి చేతుల హద్దులోవుంచూ
దొంగచూపుల కట్టేశుంచూ
కొంటెవయసూ, అదుపుతప్పితే
ఎగిరి పైబడ చూస్తుందీ
అది ఎంతపనైనా చేస్తుంది ॥వెయ్యకూ॥
కొత్తకోకా కట్టూకోనీ
గుత్తమైనా రైకా తొడిగీ
రంభలాగా పక్కనవుంటే
వయసు ఊరక వుంటుందా
నా వల్లకాదు పొమ్మంటుందా ॥తగిలించకూ॥

రచన : పాట నెం. 4 పాడినవారు
శ్రీ దాశరధి యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

కన్నులైనా తెరవనీ ఓ చిన్నిపాపా స్వాగతం
ఊహలింకా తెలియనీ నా చిట్టిపాపా స్వాగతం

ఈ జగానికి స్వాగతం - స్వాగతం - స్వాగతం
లోకమంతా శాంతి చిందిన వేగులాటీ లేదులే
మానవతకై ప్రాణమిచ్చిన బోసినవ్వే లేదులే
పూల మాదిరి మెరిసిపోయే ముళ్ళ బాటలే మిగిలెనే
నవ్వు చాటున బుసలు కొట్టే నాగుబాములె మిగిలెనే
నేటి లోకం అసలు రూపం
నీవు చూసే దెప్పుడో
నీకు తెలిసే దెన్నడో ॥కన్నులైనా॥

జాతికోసం బలైపోయిన నేత నేడిక లేదులే
జగతిలో మనకీర్తి పెంచిన విశ్వకవి లేడాయెనే
సొంత లాభం కొఱకు దేశం గొంతు నులిమేధీరులు
మంచి చేసిన వారి ముంచే మనుషులెందరో కలరులే
నేటి లోకం - అసలు రూపం
నీవు చూసే దెప్పుడో
నీకు తెలిసే దెన్నడో ॥కన్నులైనా॥

# సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ | : | శరద్ పిళ్లాంకర్ |
| మాటలు | : | ఇంటూరి వెంకటేశ్వరరావు |
| పాటలు | : | దాశరధి, కొసరాజు, ఆరుద్ర, అప్పలాచార్య |
| సంగీతం | : | యస్. పి. కోదండపాణి |
| నేపధ్యగానం | : | పి. సుశీల, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం |
| మేకప్ | : | అక్తర్, మాధవరావు, కుప్పుస్వామి |
| కేశాలంకరణ | : | రాజేశ్వరి |
| స్టంటు | : | రాఘవులు |
| దుస్తులు | : | సూర్యారావు |
| నృత్యం | : | పసుమర్తి కృష్ణమూర్తి |
| స్టిల్స్ | : | యం. సత్యం (జైహింద్ స్టూడియోస్) |
| పబ్లిసిటీ | : | గంగాధర్ |
| ప్రెస్ రిలేషన్స్ | : | మోహన్ కుమార్ |
| ప్రెస్ పబ్లిసిటీ | : | వి. కె. ఎడ్వర్ టైజర్స్ |
| కలర్ ప్రోసెసింగ్ | : | ఫిలిం సెంటర్ (బొంబాయి) |
| కలర్ కన్సల్టేషన్ | : | భట్ |

| | | |
|---|---|---|
| సెట్ ప్రాపర్టీస్ | : | నియోఫిలోమ్ క్రాఫ్ట్స్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | బి. లోకనాథ్ |
| ప్రొడక్షన్ మేనేజరు | : | డి. కృష్ణమూర్తి |
| కళ | ; | యస్. కృష్ణారావు |
| కూర్పు | : | యస్. యస్. ప్రకాశం |
| అవుట్ డోర్ యూనిట్ | : | శ్రీ ప్రొడక్షన్స్ & శారదా ఎంటర్ ప్రైజెస్ |
| రికార్డింగు & రీరికార్డింగు | : | రామనాథన్ (ప్రసాద్ స్టూడియోస్) |
| కో డైరెక్షన్ | : | జి. కేశవరావు |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | జయదేవ్ & ప్రసాద్ |
| అసోసియేట్ ఎడిటర్ | : | వెంకటరత్నం |
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | : | హెచ్. రాజు (W. I. C. A.) |
| సాంకేతిక సలహాదారు | : | రవికాంత్ నగాయిచ్ |
| స్క్రీన్ ప్లే | : | పి. ఢూండీ |
| దర్శకత్వం | : | పి. లక్ష్మీదీపక్ |
| నిర్మాతలు | : | పి. బాబ్జీ, & జి. సాంబశివరావు |
| విడుదల | : | శ్రీ ఫిలిమ్స్ |

